# హయలక్షణసారము.

ఇది శ్రీపరవస్తు శ్రీనివాసా

చార్యులయ్యవారలుఁగారిచేత

డెబ్బదిసంవత్సరముల

క్రిందట

రచింపఁబడినది

---

Publisher Sreeparavastu Sreenivasa
Jagannadhaswami Ayyavaralugaru.

Printed by D. Guranna, at the Arsha Press,
Vizagapatam.
1893.

# ప్రకరణసూచిక.

# అశ్వశాస్త్రము

## ౧

అవయవములు-

జిహ్వ ౧ నాలుక-
తాలువు ౧ నాలుకమీదిదవుడ(అంగిలి)-
సూనము ౧ నాలుక క్రింది దవుడ-
దంతములు ౪౦-
వ్యంజనదంతములు ౧౨ వయఃపరీక్ష చేసెడిదంతములు
క్రిందివిని మీదివి -
దంష్ట్రాంకురములు ౪ కోరలు క్రిందివిని మీదివిని-
హనుజములు ౨౪ నమలెడిపండ్లు-
ఓష్ఠములు ౨ క్రిందిమీది పెదవులు-
సృక్కులు ౨ సెలవులు-
చుబుకము ౧ గడ్డము-
ప్రపానము ౧ మీదిపెదవికి మీదిభాగము-
ప్రోథము ౧ ప్రపానమునకు మీదిభాగము-
నాసాపుటములు ౨ ప్రోథమునకు వలపలి దాపలి భాగములు (ముక్కురంధ్రములు)
ఘోణ ౧ ప్రోథనేత్రములకుమధ్యభాగము- (ముక్కు)
వర్తులు ౨ ఘోణకు దాపలి వలపలి భాగములు-
శీరికలు ౨ వర్తులకు మీదిభాగములు-
గండములు ౨ నాసాహనువుల మధ్యభాగములు (చెక్కిళ్లు)
అశ్రుపాతములు ౨ ఘోణాగండముల మధ్యభాగములు-

(కను దిగువ గుంటలు)

నేత్రములు ౨ కన్నులు.

శుక్లమండలములు ౨ కన్నుల తెల్లగ్రుడ్లు.

కృష్ణమండలములు ౨. తెల్లగ్రుడ్లనడిమి నల్లగ్రుడ్లు.

కనీనికలు ౨ దృష్టిమండల సంజ్ఞ కలిగిన నల్లగ్రుడ్లన డిమి పిల్లగ్రుడ్లు. (పాపలు)

అపాంగములు ౨ కనీనికల వెలుపలిభాగములు.

నేత్రకూటములు ౨ కనీనికల లోపలిభాగములు (కొలుకులు)

భ్రూవులు ౨ కనుబొమ్మలు.

ఫాలము ౧ భ్రూస్తవముల మధ్యభాగము.

స్తవము ౧ ఫాలమునకు మీదిభాగము.

శిరస్సు ౧ తల.

కర్ణములు ౨ చెవులు.

విధువులు ౨ చెవుల వెనుకభాగములు

కటములు ౨ కర్ణశంఖముల మధ్యభాగములు (కణతలు).

శంఖములు ౨ కటనేత్రాంతముల మధ్యభాగములు.

ఘోటములు ౨ కటశంఖములమీది భాగములు.

హనువులు ౨ గండసమీపబాహ్యభాగములు. (క్రిందిగెడవ రెండు వైపులు)

నిగాళము ౧ కంఠహనువుల మధ్యభాగము.

గళము ౧ నిగాళవక్షస్సుల మధ్యభాగము.

క్రోడము ౧ కంఠమూలమందలి బాహువుల మధ్యభాగము.

బాహువులు ౨ భుజములు.

జానువులు ౨ బాహువుల క్రిందిభాగములు (మోకాళ్లు)

జానములు ౨ జానువులకుమీదనుండెడి కాయలు.

జాహుత్రికములు — జానువులక్రిందిసమీపభాగములు.

మందరములు — జానువులముందటి గుంపులు.

జంఘలు — జానువులక్రిందిభాగములు.

కళలు — జంఘలవెలుపలిభాగములు.

కూర్చకములు — జంఘలక్రిందిభాగములు.

పరిహస్తములు — కూర్చముల క్రిందిభాగములు.

కిణములు — కూర్చమధ్యములయందున్నకాయలు.

కుష్టికలు — కూర్చములక్రిందిభాగములు.

ఖురములు — కుష్టికల క్రిందిభాగములు (డెక్కలు).

నఖశిఖలు — ఖురాగ్రభాగములు.

మంతూకలు — డెక్కలమధ్యభాగములు.

పార్ష్ణులు — మడమలు.

కక్షములు — కరమూలముల వెనుకటిభాగములు.

క్రోడపీఠము — బాహుమధ్యభాగమందలి ఉబ్బరి.

హృదయము — క్రోడపీఠోదరమధ్యభాగము.

ఉదరము — నాభిహృదయములమధ్యభాగము.

నాభి — బొడ్డు.

కోష్ఠములు — ఉదరపార్శ్వభాగములు.

రోమాళి — నూగారు.

పార్శ్వములు — కక్షముల వెనుకభాగములు.

కుక్షిస్ఫురణములు — పార్శ్వముల వెనుకభాగములు.

రంధ్రములు — కుక్షిస్ఫురణములకు సమముగా వెనుకనున్న కుక్షిమూలప్రదేశములు.

ఉపరంధ్రములు — రంధ్రముల క్రిందిభాగములు.

మన్యలు — కంఠపార్శ్వముల[illegible]భాగములు.

గ్రీవ ౧ శిరోభుజములమధ్యభాగము-
స్కంధములు ౨ గ్రీవకుఉపరిభాగములు-
కేశాది ౧ కేసరస్థానము-
కేశాంతములు ౨ శిరస్సునకును చెవులకును వెనుకప్ర
దేశములు-
వహములు ౨ కేశాంతసమీపభాగములు-
శాకసమ్ములు ౨ వహసమీపభాగములు-(జత్రుదేశములు
కకుదము ౧ శాకసములమీఁది ప్రదేశము-
అంసము ౧ కకుదోపరిభాగము-
ఆసనము ౧ కకుదమునకువెనుకటిభాగము- అనఁగామన
ష్యుఁడుకూర్చుండుస్థలము-
పృష్ఠము ౧ ఆసనమునకువెనుకటిభాగము-
త్రికము ౧ పృష్ఠమునకువెనుకభాగము(వెనుపూస)
జఘనము ౧ త్రికమునకువెనుకభాగము-
పుచ్ఛము ౧ తోఁక-
గుదము ౧ పుచ్ఛముక్రిందిభాగము-
భాసలములు ౨ ముష్కగుదమధ్యభాగము యొక్కయిరు
పార్శ్వభాగములు-
రోహిణీసంధులు ౨ భాసలములక్రిందిభాగములు-
స్ఫిక్కులు ౨ గుదపార్శ్వమందలిమెరకభాగములు-
వంక్షణములు ౨ అక్కడిలోతుభాగములు-
ముష్కములు ౨ అండములు-
మేహనము ౧ మేఢ్రము-
ఊరువులు ౨ తొడలు-
స్థూలులు ౨ తొడలక్రిందిభాగములు-

వక్రసంధులు — స్థూలల క్రిందిభాగములు.
జంఘులు — వక్రసంధుల క్రిందిభాగములు.
మందరములు — వక్రసంధులకును జంఘలకును మధ్యభాగములు.
కళలు — జంఘల వెలుపలిభాగములు.
కూర్చములు — జంఘల క్రిందిభాగములు.
కిణములు — కూర్చములమధ్యమునందున్న కాయలు.
కుష్ఠికలు — కూర్చముల క్రిందిభాగములు.
ఖురములు — కుష్ఠికల క్రిందిభాగములు అనఁగా డెక్కలు.
నఖశిఖలు — ఖురాగ్రభాగములు.
మండూకులు — డెక్కల మధ్యభాగములు.
పార్ష్ణులు — మడమలు.

---

## దశాక్షేత్రవిభాగప్రకరణము.

దశాక్షేత్రవిభాగమనఁగా దశావిభాగంబును క్షేత్రవిభాగంబును.

౧ దశావిభాగము—అశ్వములకు పరమాయుః ప్రమాణమైన ౩౨ సంవత్సరములలో పదియవభాగమైన ౩ సంవత్సరముల ౩ నెలల ౧౨ దినములు ఒక్కదశ. ఇట్టి దశలు పది.

౨ క్షేత్రవిభాగము—క్షేత్రములనఁగా శరీరభాగములు. అవియును దశలవలె దశసంఖ్యకలవి. అవి యెవ్వియెన్నను. ౧ జిహ్వమొదలుగా ఓష్ఠములుగాఁ గలది ప్రథమక్షేత్రము. ౨ ప్రపానము మొదలుగా ఫా

ము తుదగాఁగలది రెండవక్షేత్రము. ౩ మన్యాగళస్కంధంబులు మూడవక్షేత్రము. ౪ శిరము శాఖస జత్రు వక్షోభాగంబులు నాలవక్షేత్రము. ౫ బాహుక్రోడంబులయిదవక్షేత్రము. ౬ హృదయ కక్షా పార్శ్వంబు లాఱవక్షేత్రము. ౭ పృష్ఠోదర నాభిప్రదేశంబులు ఏడవక్షేత్రము. ౮ కుక్షిరంధ్రోపరంధ్రగుహ్యస్థానంబు లెనిమిదవక్షేత్రము. ౯ ఊరుబీజరోహిణీ స్థూలలు తొమ్మిదవక్షేత్రము. ౧౦ ఖురాంతజంఘాచతుష్టయము పదియవక్షేత్రము.

ఈ చెప్పిన క్రమము అశ్వములకు బడబలకుఁగోడిగలకు ఈ చెప్పినదానికి వ్యత్క్రమముగా అనఁగా దశమక్షేత్రంబాదిగా ఆదిక్షేత్రంబు దశమంబుగా క్షేత్రవిభాగమును నిర్ణయింపవలయును.

## శారీర ప్రకరణము.

శుభాశ్వములు (గుఱ్ఱములును గోడిగలును.)

౧ చతురశ్రమైన శోభగలముఖముగలిగిన యశ్వము.

౨ వైడూర్యమువలె నయినను, సువర్ణమువలె నయినను, స్ఫటికమువలెనయినను, పద్మమువలెనయినను, మల్లెపువ్వవలె నైనను, మకరందమువలెనయినను, వెండినేత్రములవలెనయినను, లొటిపిట నేత్రములవలెనయినను, గజనేత్రములవలెనయిననుండి, దీర్ఘములును విశాలములును ప్రసన్నములునయిన నేత్రములుగలది.

౩ మయూరాక్షము = నెమలికన్నులవంటి కన్నులు గలది.

౪ క్రౌంచాక్షము = క్రౌంచపక్షి కన్నులవంటి కన్నులుగలది.

౫ కపోతాక్షము = గువ్వకన్నులవంటికన్నులుగలది.

౬ కోకాక్షము = చక్రవాకపక్షి కన్నులవంటి కన్నులుగలది.

౭ మల్లికాక్షము = తెల్లని కన్నులుగలది.

౮ ఇంద్రాయుధము = నల్లని కన్నులుగలది.

౯ విస్తీర్ణములును గంభీరములునైన నాసాపుటరంధ్రములుగలది.

౧౦ సమానదంతపంక్తులు గలది.

౧౧ సమానోష్ఠపుటద్వయము గలది.

౧౨ వర్తులములును దృఢములునయిన డెక్కలుగలది.

౧౩ ఇంచుక ఉన్నతములయిన లలాటమును కకుదమును శిరస్సును గలది.

౧౪ ఇంచుక నమ్రములైన స్కంధమును ఘోణయును శుష్కికలును పృష్ఠమును గలది.

౧౫ వక్రములును సుందరములునయిన వక్షస్థలును పార్శ్వములును గలది.

౧౬ కుఱుచలయిన శ్రోత్రమును ఆసనమును కూర్చములును కుక్షికములును గలది.

౧౭ వర్తులములయిన జంఘలును పిఱుదులును బాహువులును జానువులును కలది.

౧౮ విశాలములయిన వక్షస్థలమును జఘనమును కలది.

౧౯ కుఱుచయయిన బాహువులును జంఘలును మొగమును ఫాలమును గలది.

౨౦ పూర్ణములయిన కుక్షిస్ఫురణములును ఉదరమును

కలది.

౨౧ పొడవయి తెల్లనయిన కేసరములుగ, జానువుల పర్యంతము పొడవుగల వాలమును గలది.

౨౨ కుఱుచలయిన గండములును కర్ణములును గడ్డమును అండములును కలది.

౨౩ చంచలములైన జిహ్వయును కర్ణములును నేత్రములును పాదములును పుచ్ఛమును కలది.

౨౪ సన్ననిదైన నెలవులును ఓష్ఠములును జిహ్వయును చర్మమును కలది.

౨౫ సన్నములైన బాహువులు కలది.

౨౬ దళమయిన అధరోష్ఠము కలది.

౨౭ తళతళని మెఱసెడి నేత్రములు గలది.

అశుభాశ్వములు.

౧ రోదనాక్షము= ఎప్పుడును కన్నీళ్లు వడలుచునుండునది.

౨ పింగళాక్షము= పచ్చనయిన రెండుకన్నులను గలది.

౩ ఏకపింగళనేత్రజము=ఏకపింగళమైన [illegible]నది.

౪ సత్త్వహీనము.

౫ దీర్ఘములైన వాలమును, బాహువులును జంఘలును స్కంధమును ఆసనమును కర్ణమును మెడయును కలది.

౬ గోడిగలను పోలినది.

శుభబడబలు (మంచిగోడికలు).

౧ వెడల్పుగలవెన్నును, కుఱుచలయిన [illegible]లును, పొడవైన మెడయును, నిడుదయయినవాలమును, క

అది- ఇది అధిపతికి శుభమును జేయును.

౨ పలుచనయిు కుఱుచయయిున కొంకటికలది- దీనికి జవసత్త్వములు అధికముగా కలిగియుండును- శుభమును జేయును.

౩ పొడవైన ముఖమును నిడుదలయి వెడల్పు కలవయిున నేత్రములును వక్షస్థలములును మెడయును వెన్నును కలిగినది- ఇది అధిపతికి శుభమును జేయును.

౪ గుఱ్ఱములను బోలినది- అధిపతికి శుభమును జేయును- గుఱ్ఱములను బోలినగోడిగలకు విషమపాదిత్వము మొదలయిన దోషములను ఆలోచించనక్కఱలేదు-

## బ్రాహ్మణాది జాతి ప్రకరణము.

మంచిధ్వనియును సుగంధమును సుశీలత్వమును సౌందర్యమును గలిగిన తెల్లని గుఱ్ఱము బ్రహ్మజాతి.

గంభీరధ్వనియును అతిశీఘ్రత్వమును శౌర్యమును లాఘవమును జవసత్త్వములును కలిగిన యెఱ్ఱని గుఱ్ఱము క్షత్త్రజాతి.

అభిషానిశూన్యత్వమును మృదుత్వమును చాంచల్యమును కలిగిన పచ్చనిగుఱ్ఱము వైశ్యజాతి-

క్రోధమును చాంచల్యమును కలిగిన నల్లనిగుఱ్ఱము శూద్రజాతి.

## వర్ణ ప్రకరణము.

సాధారణవర్ణములు, అనువర్ణములు, చిత్రవర్ణములు, అని వర్ణములు మూడుప్రకారములు కలవి.

### అందు సాధారణవర్ణములు.

౧ కర్క్యము=అచ్చతెలుపుది. ఇది తెనుఁగున కర్క్యయనఁబడును. దీనికి అధిదేవత శ్రీకృష్ణులు.

౨ శ్యామము=అచ్చపు నలుపుది. దీనిని తెనుఁగున గొంగడందురు. దీనికి అధిదేవత సూర్యుఁడు.

౩ హారితము=అచ్చపు పచ్చనిది. దీనిని తెనుఁగున హారియఁడందురు. దీనికి అధిదేవత ఇంద్రుఁడు.

౪ శోణము=అచ్చపు ఎఱ్ఱనిది. దీనిని తెనుఁగున బంటీయని యందురు. దీనికి అధిదేవత అగ్ని.

### అనువర్ణములు.

౧ గంగాజలవర్ణి = గంగాజలవర్ణమువంటి వర్ణముగలది. దీనిని తెనుఁగున గంగుపాణియని యందురు. దీనికి అధిదేవత బ్రహ్మ.

౨ మేఘవర్ణి=మేఘవర్ణమువంటి వర్ణముగలది. దీనికి అధిదేవత వరుణుఁడు.

౩ కపిలవర్ణి=ఎరుపును నలుపును గలిసిన వర్ణము గలది. దీనికి అధిదేవత శివుఁడు.

౪ శుకవర్ణి=ఆకుపచ్చ వర్ణము గలది. దీనిని తెనుఁగున శుకాంగి యందురు. దీనికిని అధిదేవత శివుఁడె.

౫ నీలోత్పలవర్ణి=నల్లగలువవర్ణమువంటి వర్ణము గలది. దీనికి అధిదేవత వాయువు.

౬ కుముదవర్ణి=తెల్లగలువవర్ణమువంటి వర్ణము గలది. దీనికి అధిదేవత కుబేరుఁడు.

౭ నీలవర్ణ=నీలమణివర్ణమువంటి వర్ణముగలది. ఇది తెనుఁగున నీలినియనఁబడును. దీనికి అధిదేవత అదితి.

౮ మధుపుష్పవర్ణ=ఇప్పపుష్పవర్ణమువంటి వర్ణముగలది ఇది తెనుఁగున రేవటినీలడనఁబడును. అధిదేవత చంద్రుఁడు.

౯ సితాసితవర్ణ=సితాసితవర్ణములు కలిసిన వర్ణముగలది. తెనుఁగున రేవటినీలఁడనఁబడును.

౧౦ అంజనవర్ణ=కాటుకవర్ణమునంటి వర్ణముకలది. తెనుఁగున అంజనకేశుఁడని చెప్పఁబడును.

౧౧ రక్తపాటలము = రక్తవర్ణము అధికముగాను పాటలవర్ణము క్రొద్దిగానేను కలిసిన వర్ణము కలది.

౧౨ సింధువారకము = వావిలిపూవు వర్ణమువంటి వర్ణము కలది.

చిత్రవర్ణములు.

ఈచిత్రవర్ణములు కల అశ్వములన్నియును హాలాహాసంజ్ఞ కలవి.

అందు శుభములు.

౧ పంచకల్యాణము=శరీరమందంతట అన్యవర్ణమును తెల్లని పాదచతుష్టయమును మొగమును గలది. ఇది అధిపతికి జయమును కలుగఁజేయును.

౨ అష్టమంగళము=శరీరమందంతట అన్యవర్ణమును తెల్లని పాదచతుష్టయమును శిరస్సును వాలమును ముఖమును వక్షస్థలమును కలది. ఇది అధిపతిని రారాజును చేయును.

౩ శ్యామకర్ణము=శరీరమందంతట తెల్లనివర్ణము కల్గియు నల్లని చెవులుకలది. అధిపతికి శుభమును జేయును.

౪ చతుర్భద్రము=శరీరమందంతట అన్యవర్ణమును తెల్లనిపాదచతుష్టయమును గలది. ఇది అధిపతికి సార్వభౌమత్వమును జేయును.

౫ దివావైజయికము=ఎఱ్ఱని పూర్వార్ధశరీరభాగమును తెల్లనిపశ్చిమార్ధశరీరభాగమునుకలది. ఇది అధిపతికి పాపనాశమును జేయును.

౬ నిశావైజయికము=తెల్లని పూర్వార్ధశరీరభాగమును ఎఱ్ఱని పశ్చిమార్ధశరీరభాగమును కలది. ఇదియును అధిపతికి పాపనాశమును జేయును.

౭ రక్తాగ్రకర్ణి=ఎఱ్ఱని కొనచెవులు గలది. ఇది దీర్ఘాయువగును.

౮ శ్వేతబాహువు=తెల్లని బాహువులు కలది. ఇది రాజార్హము. అధిపతికి శుభమును జేయును.

౯ త్రిభద్రము=తెల్లని ముఖమును పూర్వాంఘ్రులును గలది. ఇది అధిపతికి యుద్ధజయమును చేయును.

౧౦ శ్వేతఖురి=తెల్లని గొరిజలుకలది. అధిపతిని లక్ష్మీనివాసమునుగా జేయును.

౧౧ హారితదక్షిణపాది=పచ్చని వలపలి కాళ్లు కలది. ఇది అధిపతికి శుభమును చేయును.

౧౨ ఊర్ధ్వానేకరేఖస్రోతి=మూతిని అనేకములయిన ఊర్ధ్వరేఖలు కలది. ఇది దీర్ఘాయువగును. అధిపతికి సర్వదేశములయందును శుభమును చేయును.

౧౩ త్రిరేఖప్రోథి=మూతిని మూడురేఖలుగలది. ఇది దీర్ఘాయువును అధిపతికి శుభమ్మును చేయును.

౧౪ దీర్ఘైకరేఖావిశిష్ట త్రిరేఖప్రోథి=మూతిని ఎక్క తెగకుండ మూడురేఖలుగల్గదై పొడవైన యొక్క రేఖగలది. అధిపతికి దీర్ఘాయువును శుభమును చేయును.

౧౫ శ్రీకారరేఖాప్రోథి=మూతిని శ్రీకారమువంటి రేఖగలది. అధిపతికి శుభమును దీర్ఘాయువును చేయును.

౧౬ దక్షిణకర్ణాగ్రశ్విత్రి=వలపలి చెవితుదను బొల్లికలది.

౧౭ వామకర్ణాగ్రశ్విత్రి=ఎడమచెవితుదను బొల్లికలది. అధిపతికి పుత్రలాభమునున్ను పాపనాశమునున్ను చేయును.

౧౮ జానుశ్విత్రి=మోకాలియందు బొల్లికలది. అధిపతికి శుభమును చేయును.

౧౯ అండశ్విత్రి = అండములయందు బొల్లికలది. అధిపతికి భార్యాలాభమునును పుత్రలాభమునును సంపదనును చేయును.

౨౦ మేఢ్రశ్విత్రి = మేఢ్రమందు బొల్లిగలది. అధిపతికి భార్యాలాభమునును పుత్రలాభమునును సంపదనును చేయును.

౨౧ కంఠశ్విత్రి = కంఠమందు బొల్లిగలది. అధిపతికి భూమండలాధిపత్యమునును ఇంద్రభోగమునును గలుగఁజేయును.

౨౨ కక్షశ్విత్రి=కక్షమందు బొల్లిగలది.

౨౩ నాభిశ్శ్వేత్రి=బొడ్డు యందు బొల్లిగలది.

౨౪ వక్షశ్శ్వేత్రి=వక్షమందు బొల్లిగలది-
ఇవి(౨౨-౨౩-౨౪) అధిపతికి భూమండలాధి
త్యమును లక్ష్మీనివాసమును చేయును.

౨౫ సుపర్శ్వేత్రి=లలాటోపరి భాగమందు బొల్లిగలది
అధిపతికి రాజ్యలాభమును చేయును.

౨౬ కర్ణమూలశ్శ్వేత్రి=చెవి మొదట బొల్లిగలది- అ
పతికి భార్యాలాభమును పుత్రలాభమును
యును.

౨౭ లలాటశ్శ్వేత్రి=ముఖమందు బొల్లిగలది- అధిపతి
ధనలాభమును చేయును.

౨౮ కేశాంతశ్శ్వేత్రి=కేశాంతమందు బొల్లిగలది- అ
పతికి రాజ్యలాభమును చేయును.

౨౯ పశ్చిమాంఘ్రిశ్శ్వేత్రి=వెనక కాళ్లయందు బొల్లి
లది- అధిపతికి లక్ష్మిని కలుగజేయును.

అశుభములు.

౧ మార్జాలవర్ణి=శరీరమందంతట పిల్లి వర్ణము
వర్ణముగలది- అధిపతికి సంపన్నాశమును చే
ను.

౨ సారంగవర్ణి=శరీరమందంతటను ఇట్టి వర్ణ
వంటి వర్ణముగలది- ఇదియును అధిపతికి సం
న్నాశమును చేయును-

౩ వామహనురేఖ=డాపలిహనువునందు రేఖగలది-
ధిపతికి కలహమునును శత్రువృద్ధిని చేయును

౪ వాలవామభాగరేఖ=వాలముయొక్క వామభాగ
దు రేఖగలది- అధిపతికి కలహమునును శత్రువ

నిని. చేయును.

౫ హారితాగ్రకర్ణీ = పచ్చని కొనచెవులుగలది.

౬ నీలాగ్రకర్ణీ = నల్లని కొనచెవులుగలది.

ఇవి (౫ - ౬) అల్పాయుష్యులగును.

౭ శ్వేతోదరి = నల్లని శరీరంబును తెల్లని ఉదరంబును కలది. అధిపతికి కులక్షయమును చేయును.

౮ కరదాకి = నల్లని నోరుగలది. అధిపతికి అశుభమును చేయును.

౯ శ్వేతదక్షిణపాది = తెల్లని వలపలి కాళ్ళుగలది. అధిపతికి అశుభమును చేయును.

౧౦ హృదయశ్విత్రి = హృదయమందు బొల్లిగలది. అధిపతికి యుద్ధాపజయమును చేయును.

౧౧ గండశ్విత్రి = గండమూలయందు బొల్లిగలది. అధిపతికి యుద్ధమందు అపజయమును చేయును.

౧౨ ఉదరశ్విత్రి = కడుపునబొల్లిగలది. అధిపతికి యుద్ధములు సంఘటింపజేయును.

౧౩ కకుదశ్విత్రి = మూపురమందు బొల్లిగలది.

౧౪ ఆసనశ్విత్రి = వెన్నునబొల్లిగలది.

౧౫ త్రికశ్విత్రి = వెన్నుపూసయందు బొల్లిగలది.

౧౬ గుదశ్విత్రి = గుదమందుబొల్లిగలది.

౧౭ వక్రసక్థిశ్విత్రి = కొంకులయందు బొల్లిగలది.

౧౮ ప్రోథశ్విత్రి = మూతినిబొల్లిగలది.

౧౯ కాకసశ్విత్రి = జత్రుదేశములయందు బొల్లిగలది.

ఇవి (౧౩ — ౧౯) అధిపతికి అశుభమును చేయును.

## ఆవర్త ప్రకరణము.

ఆవర్తములు (సుడులు) ఎనిమిది విధములగు నాకరములు గలిగి యెనిమిది నామముల చేత వ్యవహరింపబడును.

౧ శక్తి = ముత్యపు చిప్పవంటి యాకారము కలది. అంగుళద్వయ పరిమితము.

౨ ఆవర్తము = నీటి సుడివంటిది. అంగుళత్రిభాగపరిమితము.

౩ సంఘాతము = తేజఃపుంజమువంటిది. అష్టాంగుళపరిమితము.

౪ పాదుక = పావవంటిది. చతురంగుళపరిమితము.

౫ అర్థపాదుక = నడిమికి విరిగిన పావలోసగము వంటిది. హీనపాదాంగుళపరిమితము.

౬ అవలీఢము = దూడ నాకుడువంటిది. అంగుళత్రయపరిమితము.

౭ శతపది = జెఱ్ఱివంటిది. చతురంగుళ పరిమితము.

౮ ముకుళము = మల్లెమొగ్గవంటిది. అంగుళచతురాగ పరిమితము.

ఈ యెనిమిదియు నే చెప్పిన పరిమాణముల కల్పాధికములు కాకుండెనా, ఇకఁ జెప్పఁబడు ఫలములనిచ్చును. లేకున్న ఫలప్రదములు కావు.

ఆవర్తములు సామాన్యముగా త్రయోవింశతుత్తరశత (౧౨౩) సంఖ్యములు. ఇవి శుభములనియును అశుభములనియును రెండు తెఱంగులు. అందు శుభావర్తములు నలువదియేడును (౪౭) ధ్రువములనియు నాగంతుకములనియు రెండు విధములు.

అందు ధ్రువములు పది.

౨ ధ్రువములు వక్షస్థలమునందు.
౨ ,, శిరస్సునందు.
౨ ,, రంధ్రములయందు.
౨ ,, ఉపరంధ్రములయందు.
౧ ,, లలాటమందు.
౧ ,, ప్రపాణమందు.

ఫలము.

ఈ పది ధ్రువములు సర్వాశ్వముల కన్నిటికి నుండవలసినవి. ఇవి కలిగియుండు నశ్వము దీర్ఘాయువై యుండును. అధిపతికి మంగళప్రదము. వీనిలో నొకటి తక్కువయిన నశ్వాయువు నధిపతికి నమంగళకరమునగును.

ఆగంతుకములు ముప్పది యేడు.

౧ రోచమానము = గళమునకు ఆఱు అంగుళములు క్రిందుగా నుండును. భూమండలాధిపత్యమును కలుగఁజేయును.

౫ శ్రీవృక్షకము = రోచమానము, తనదిగువను వక్షమందు నాలుగు సుడులు కలిగియుండెనా శ్రీవృక్షకమనఁబడుచుండును. దీనికి ఫలములు సంతోషము. సంపద. భోగము. ప్రతాపము. శత్రుజయము.

౧ దేవమణి = గళమునకు నాలుగంగుళముల క్రింద నుండును. ఇంద్రవైభవమును కలుగఁజేయును.

౨ మేఖల = ధ్రువములలోనివి కాక ఉపరంధ్రములలో కలుగునవి. మణిమయభూషణసంపత్తినిఁ జేయును.

౨ వృషభములు = కర్ణమూలమందు పుట్టునవి. మణికుండలాది సంపత్తిని కలుగఁజేయును.

౨ అశ్రుపాతావర్తి = ఘ్రాణమును గండములకును మధ్యభాగములయందు సుడులు గలది. అధిపతియొక్క చతురంగబలనాశమును జేయును.

౨ నేత్రకూటావర్తి = కన్నుల మీదిరెప్పలయందు సుడులు గలది. అధిపతికి అక్షి వ్యాధులను జేయును.

౨ భ్రూమధ్యావర్తి = కనుబొమల మధ్యభాగములయందు సుడులు గలది. అధిపతికి మిత్రులతో విరోధమును జేయును.

౨ కర్ణాగ్రావర్తి = చెవులకొనలయందు సుడులు గలది. అధిపతికి కర్ణనాశమునయినం గర్ణరోగమునైనం జేయును.

౨ విద్యావర్తి = చెవులవెనకభాగములయందు సుడులు గలది. అధిపతికి సౌఖ్యనాశముం జేయును.

౪ కటావర్తి = కర్ణశంఖముల మధ్యభాగములయందు సుడులు గలది. అధిపతికి మరణముం జేయును.

౨ శంఖావర్తి = కటనయనాంతమధ్యభాగములయందు సుడులు గలది. అధిపతికి యుద్ధమరణమును జేయును.

౨ ఘోటావర్తి = కటశంఖముల మీదిభాగములయందు సుడులు గలది. అధిపతికి మిత్రనాశమును జేయును

౨ హన్వావర్తి = గండఘోట సమీప బాహ్యభాగములయందు సుడులు గలది. అధిపతికి అధిక దారిద్ర్యమును జేయును.

౧ క్రోడావర్తి = బాహుమధ్యభాగమందు సుడి గలది అధిపతికి మరణమునుం జేయును.

౧ ఘోణావర్తి = ఘోణయందు సుడి గలది. అధిప-

౪ కుక్షికావర్తి = కూర్చముల క్రిందిభాగములయందు సుడులుగలది.

౨ కక్షావర్తి = కరమూలముల వెనుకభాగములయందు సుడులుగలది. అధిపతికి యుద్ధాపజయమును జేయును.

౧ హృదయావర్తి = క్రోడపీఠోదర్య మధ్యభాగమందు సుడిగలది. అధిపతికి అశుభమును జేయును.

౧ ఉదరావర్తి = హృదయనాభిమధ్యభాగమందు సుడిగలది. అధిపతికి ఉదరరోగమును జేయును.

౧ నాభికావర్తి = బొడ్డుయందు సుడిగలది. అధిపతికి ఉదరరోగమును జేయును.

౪ కుక్షిస్ఫురణావర్తి = ప్రక్కలయందు ధ్రువములు కాకరెండేసిసుడులుగలది. అధిపతికి శత్రువులవల్ల క్షోభమును గల్గజేయును.

౨ మన్యావర్తి = కంఠపార్శ్వముల మీదిభాగములయందు సుడులుగలది. అధిపతికి మరణమును జేయును.

౧ గ్రీవావర్తి = శిరోభుజముల మధ్యభాగమందు సుడిగలది. అధిపతికి యుద్ధమరణమును జేయును.

౧ గళావర్తి = కుత్తుకయందు సుడిగలది. అధిపతికి యుద్ధమరణమును జేయును.

౨ స్కంధావర్తి = గ్రీవకు ఉపరిభాగములయందు సుడులుగలది. అధిపతికి యుద్ధమరణమును జేయును.

౨ వహావర్తి = కేశాంతసమీపభాగములయందు సుడులుగలది. అధిపతికి అశుభమును జేయును.

౧ శోకస్రావర్తి = జత్రుదేశములయందు సుడిగలది. అ

ధిపతికి యుద్ధమరణమును జేయును-

౯ కకుదావర్తి = మూపురమందు సుడిగలది- అధిపతికి సౌఖ్యనాశమును జేయును-

౧౦ ఆసనావర్తి = రౌతుకూర్చుండెడి స్థలమందు సుడిగలది- అధిపతికి మరణమును జేయును-

౧౧ త్రికావర్తి = వెనుపూసయందు సుడిగలది- అధిపతికి యుద్ధమరణమును జేయును-

౧౨ జఘనావర్తి = వెన్నుపూసయొక్క వెనకభాగమందు సుడిగలది- అధిపతికి యుద్ధమరణమును జేయును-

౧౩ పుచ్ఛావర్తి = వాలమూలపార్శ్వములయందు సుడులుగలది- అధిపతికి పరదారనిమిత్తకమయిన నాశమును సంభవింపజేయును.

౧౪ గుదావర్తి = తోక క్రిందిభాగములయందు సుడిగలది- ఉదరరోగమును జేయును-

౧౫ స్ఫూరావర్తి = వక్రసక్థుల క్రిందిభాగములయందు సుడులుగలది- అధిపతితోఁగూడ శస్త్రములచేత వధింపఁబడును-

౧౬ బీజావర్తి = అండములయందు సుడులుగలది- అధిపతికి పుత్రశోకమును జేయును-

౧౭ కోశావర్తి = మేహనమందు సుడులుగలది- అధిపతికి కాయక్లేశమును పుత్రనాశమునుఁ జేయును-

౧౮ భానలావర్తి = గుదపార్శ్వభాగములయందు సుడులుగలది- అధిపతికి కీడును జేయును-

౧౯ స్ఫిగావర్తి = తొడలయందు సుడులుగలది- అధిపతికి యుద్ధమరణమును జేయును-

౨ పాదపార్శ్వ = కాళ్ళయందు సుడులుగలది. అధిపతికి ఐశ్వర్యనాశమును జేయును.

ఈ చెప్పిన ౧౨౨ సుడులు చెప్పఁబడిన ప్రదేశములయందు తొలఁగక యుండెనేని అధికఫలము నిచ్చును. చెప్పఁబడిన ప్రదేశమునకు పార్శ్వభాగముల యందుండెనేని మధ్యఫలము నిచ్చును. చెప్పఁబడిన ప్రదేశమునకు దిగువనుండెనేని హీనఫలము నిచ్చును.

---

## సత్త్వప్రకరణము.

సత్త్వములు సాత్త్వికసత్త్వములును రాజససత్త్వములును తామససత్త్వములును అని మూడు ప్రకారములు.

అందు సాత్త్వికసత్త్వములు ఏడు.

౧ బ్రహ్మసత్త్వము = కామమును క్రోధమును లేనిది.

౧ ఋషిసత్త్వము = మదమును మోహమును ద్వేషమును లేనిది.

౧ ఇంద్రసత్త్వము = తేజోవైభవము కలది.

౧ కుబేరసత్త్వము = ఆటపాటలకు మిక్కిలి సంతసించిది.

౧ యమసత్త్వము = మాయయును రాగమును మోహమును లేనిది.

౧ గంధర్వసత్త్వము = సంగీతప్రియత్వమును సుతచింతియును ప్రసన్నత్వమును కలది.

౧ వరుణసత్త్వము = శౌర్యమును శుచిత్వమును జలప్రియత్వమును కలది.

ఈయేడును ఉత్తమములు.

రాక్షససత్త్వములు ఆఱు-

౧ రాక్షససత్త్వము = అధికాహారమును నిద్రాళుత్వముసు కోపస్వభావమును కలది.

౧ అసురసత్త్వము = గర్వమును శౌర్యమును రౌద్రత్వమును కలది.

౧ పిశాచసత్త్వము = ఆహారశక్తియును భయమును అశుచిత్వమును కలది.

౧ పితృసత్త్వము = ఆహార బాహుళ్యమును దుర్బలత్వమును దుస్స్వభావమును కలది.

౧ సర్పసత్త్వము = కోపస్వభావమును చంచలత్వమును భయమును కలది.

౧ పక్షిసత్త్వము = అధికాహారమును అశుచిత్వమును చంచలత్వమును భయమును కలది-

ఈయాఱును మధ్యమములు.

తామససత్త్వములు మూడు.

౧ పశుసత్త్వము = ఆకలియును జడత్వమును అలసత్వమును బలుపును కలది.

౧ మత్స్యసత్త్వము = భయశీలత్వమును సంతతాహారత్వమును జలప్రియత్వమును కలది.

౧ వీరుత్సత్త్వము = జడత్వమును చింతాస్వభావమును నిద్రాళుత్వమును అలసత్వమును కలది.

ఈమూడును అధమములు.

సత్త్వప్రకరణము సమాప్తము.

## ఛాయా ప్రకరణము.

ఛాయ యనఁగా సూర్యునిని ఆకాశమునను గప్పి వ్యాపించియుండెడి మేఘము భంగిని అశ్వశరీరమందున్న సకలలక్షణములనును ఆవరించి ప్రకాశించెడి కాంతి విశేషము.

అందుశుభచ్ఛాయలు మూడు

౧ పార్థివి = నానావర్ణములు కలిగి స్నిగ్ధమై నేత్రప్రియమై నిగనిగ మెఱయుచుండునది.

౨ ఆగ్నేయి = బంగారమువలెనును పగడమువలెనును ప్రకాశించునది

౩ వారుణి = నీలమేఘమువలెనును నల్లగలువవలెనును నిర్మలోదకమువలెనును ప్రకాశించెడిది.

అశుభచ్ఛాయలు రెండు.

౧ వాయవి = చాంచల్యంబును పరుషత్వంబును కలది.

౨ నాభసి = అల్పమై ఆకాశసమానమైనది.

ఈరెండు ఛాయలునుగల గుఱ్ఱములు అల్పాయువు లగును.

అశుభలక్షణములెన్నియున్నను మంచిఛాయగలిగిన జాత్యశ్వమాయెనా ఆ యశుభములవల్లనైన హాని కలుగదు.

ఛాయా ప్రకరణము సమాప్తము.

---

## గంధ ప్రకరణము.

అశ్వములు సుగంధియనియు దుర్గంధియనియును రెండు ప్రకారములు గలవి.

నేత్రములయందును కర్ణములయందును ముఖమందును నాసాపుటములయందును చెమటయందును మూత్ర పురీషములయందును, ఆజ్య (నేయి) గంధమువలెనయినను దుగ్ధ (పాలు) గంధమువలెనయినను గజమదగంధమువలెనయినను పుష్పగంధమువలెనయినను ఉన్నగంధముగలది సుగంధియనఁబడును. ఇది శుభమయినది.

నేత్రములయందును కర్ణములయందును ముఖమందును నాసాపుటములయందును చెమటయందును మూత్ర పురీషములయందును మత్స్యగంధము వలెనయినను రుధిర (నెత్తురు) గంధమువలెనయినను శవ (పీనుగు) గంధము వలెనయినను మార్జారగంధమువలెనయినను గర్దభగంధమువలెనయినను వరాహ గంధమువలెనయినను శునక (కుక్క) గంధమువలెనయినను ఉన్నగంధముగలది దుర్గంధియనఁబడును. ఇది యశుభమైనది.

గంధ ప్రకరణము సమాప్తము.

## స్వర ప్రకరణము.

అశ్వములు సుస్వరములనియును దుస్స్వరములనియును రెండువిధములు.

వీణాధ్వనివలెనయినను, మృదంగధ్వనివలెనయినను దుందుభిధ్వనివలెనయినను క్రౌంచధ్వనివలెనయినను మేఘధ్వనివలెనయినను సింహధ్వనివలెనయినను వ్యాఘ్రధ్వనివలనైనను ఉన్నసకిలింత గలది సుస్వర మనఁబడును. అధిపతికి శుభమును జేయును.

భిన్నమై సూక్ష్మమై పరుషమై గద్గదమై శిథిల

వలెనయినను ధ్వజము వలెనయినను తెల్లని పుండ్రము ఘోణయందైనను ప్రోథమందైనను లలాటమందైనను కలది. ఇది అధిపతికి విజయమును జేయును.

౨ లలాటమందు చంద్రునివలెనయినను అర్ధచంద్రుని వలెనయినను మణి వలెనయినను మొగ్గ వలెనయినను వజ్రము వలెనయినను పుండ్రము కలది. అధిపతిని విజయము గలవానిని గాను సమస్తమంగళములకును అన్నభూమియైనవాని గాను జేయును.

దుష్పుండ్రములు అయిదు.

౧ తెల్లనివర్ణమైనను అన్యవర్ణమైనను శరీరమందు కలదై తెల్లని వర్ణముకంటె అన్యమయ్యెను విషమమయ్యెను భిన్నమయ్యెను విరిగి పోయిన చట్టివలెనయినను సంకెల వలెనయినను పాశము వలెనయినను అడ్డముగానయినను పుండ్రము ప్రోథమందయినను లలాటమందయినను కలది. ఇది అధిపతికి అశుభమును జేయును.

౨ నీలలోమవత్పుండ్రి = నల్లని వెంట్రుకలు మధ్యమందుగల తెల్లని పుండ్రము కలది.

౩ రక్తలోమవత్పుండ్రి = ఎఱ్ఱని రోమములు మధ్యమందుగల తెల్లని పుండ్రము గలది.

౪ పింగలలోమవత్పుండ్రి = పచ్చని రోమములు మధ్యమందుగల తెల్లని పుండ్రము గలది.

౫ పింగరేఖావత్పుండ్రి = పచ్చని చారలుమీదగల ని పుండ్రము కలది.

పుండ్ర ప్రకరణము సమాప్తము.

## పుష్ప ప్రకరణము.

పుష్పము లనఁగా అశ్వముల యొక్క సర్వావయవముల యందు నున్న నానా వర్ణపు చుక్కలు.

### పుష్పగుణములు.

౧ కనకపుష్పి=పచ్చని చుక్కలు గలది. ఇది శ్రేష్ఠము.

౨ శ్వేతపుష్పి=తెల్లని చుక్కలు గలది. అధిపతికి శుభమును జేయును.

౩ శుభావర్త ప్రదేశగత శోణపుష్పి=శుభావర్తములుండెడి స్థలములయందు యెఱ్ఱని చుక్కలుగలది. అధిపతికి శుభమును జేయును.

### పుష్పదోషములు.

౧ కపిలపుష్పి=కపిలవర్ణపు చుక్కలు గలది. అధిపతిని నశింపఁజేయును.

౨ శుభావర్తాన్య దేశగతశోణ పుష్పి=శుభావర్తములు లేని ప్రదేశముల యందు ఎఱ్ఱని పుష్పములు గలది. అధిపతికి అశుభమును జేయును.

తెల్లనిగుఱ్ఱమునకు వీపునఎఱ్ఱని మచ్చ యుండెనేని అధిపతికి యశముఅణగునట్లు చేయును.

పుష్ప ప్రకరణము సమాప్తము.

---

## వయఃపరిమాణ ప్రకరణము.

వ్యంజనములనుపట్టి వయస్సునిర్ణయింపఁబడును. వ్యంజనము లనునవి అయిదుసంవత్సరములకు తరువాతను దంతములయందు కలిగెడి విశేషములు. అవి గా

దంష్ట్రాంకురములు అనఁగా కోరలు నాలుగు-
హనుజములు అనఁగా నవిలెడిపండ్లు ఇరువన్నాలుగు-
వయః పరిమాణ ప్రకరణము
సమాప్తము

మహాదోష ప్రకరణము-

దంతదోషములు-

౧ అసితదంతి=నల్లనిపండ్లు కలది-సంపన్నాశము జేయును-

౨ విషమదంతి=పంక్తి చక్కగా నుండక లోపలికయినను వెలుపలి కయినను ఒరిగిన పండ్లు కలది- పుత్ర శోకమును జేయును-

౩ శుష్కదంతి=చిప్పలవంటి పండ్లు గలది- అధిపతిని క్షుత్పిపాసలచేత బాధలు పొందఁ జేయును-

౪ హీనదంతి=నలుబది దంతములకు తక్కువయయిన దంతములు గలది- అధిపతిని సంతానహీనునిగా నశింపఁ జేయును- మిత్రభయమును శత్రువృద్ధిని జేయునని కొందరందురు.

౫ అధికదంతి=నలుబది దంతములకన్న నెక్కుడు దంతములు కలది- ప్రజలతో విభుని గూడ జనునవీను చూచి నశించును-

౬ పుష్పపళ్ళ గలది- సంపన్నాశమును జేయును-

౭ కరాళదంతి=క్రింది పండ్లు వెడల్పయినను మీది పండ్లు వెడల్పయినను వాడవు గల దంతము గలది- కులక్షయమును జేయును.

౮ వికరాళదంతి=గోవులదంతములవంటిపండ్లయినను మనుష్యులదంతములవంటిపండ్లయినను కలది. కులక్షయమును జేయును.

౯ దంతార్గళము=ఎడ రెండుగా నొక్క పండ్లు కలది. కులక్షయమును జేయును.

౧౦ మూలదంతి=పండ్లన్నియు వచ్చినాని మొదట జే ల పండ్లు గలది. కులక్షయమును జేయును.

౧౧ సౌరమేయదంతి= కనక దంతములవంటిపండ్లు గలది. అశుభమును జేయును.

౧౨ సూకరదంతి=పంది పండ్లవంటి పండ్లు గలది. అశుభమును జేయును.

౧౩ బిడాలదంతి=పిల్లిపండ్లవంటి పండ్లు గలది. అశుభమును జేయును.

౧౪ రూఢదంతి=పండ్లూడవలసిన కాలమందు ఊడని పండ్లు కలది. అధిపతికి మరణమును జేయును.

౧౫ జాతదంతి=పుట్టినప్పుడు దంతములతోఁ గూడ పుట్టినది. అధిపతికి అశుభమును జేయును.

౧౬ జాతదంష్ట్రము=పుట్టినప్పుడు కోరలు కలిగి పుట్టినది. అధిపతికి అశుభమును జేయును.

అండదోషములు.

౧ ఇంద్రవృద్ధి=అయిదు సంవత్సరములయినను అండములు మొలవక సురత యోగ్యతలేకుండ నున్నది తానును నశించును. అధిపతిని నశింపఁజేయును.

౨ ఏకాండి=ఒక్క యండము కలది. పుత్రసహితముగా అధిపతిని నశింపఁజేయును.

౩ త్ర్యండి=మూడు అండములు గలది. పుత్రసహిత

ముగా అధిపతిని నశింపఁ జేయును.

౪ వివిధవర్ణాండి=నానావర్ణములు గల అండములు గలది. అధిపతి పుత్రమిత్రులను నశింపఁజేయును.

౫ లంబాండి=మిక్కిలిగా వ్రేలుచున్న అండములు గలది. అధిపతి కౌతుకమును హరించును.

౬ లోమశాండి=మిక్కిలి వెంట్రుకలు గల అండములు గలది. అధిపతి కౌతుకమును హరించును.

౭ మార్జాలాండి=పిల్లి అండములవంటి అండములు గలది. అధిపతికి అపజయమును జేయును.

౮ మర్కటాండి=కోతి అండములవంటి అండములుగలది. అధిపతికి అపజయమును జేయును.

౯ జాతాండి=పుట్టఁగా పుట్టిన అండములుగలది. అధిపతికి గృహదాహమును జేయును.

కేశదోషములు

౧ జటామిశ్రకేశి=జడలు కట్టిన వెంట్రుకలు గలది.

౨ సీమంతకేశి=పాపిటలోఁ గూడిన వెంట్రుకలు గలది.

౩ ముంజకేశి=ఖుజం వెంట్రుకలు గలది.

ఈమూడును అధిపతికి సుఖనాశనమును చేయును.

౪ హీనకేశి=కేశములు లేకుండ పుట్టినది.

౫ హీనపుచ్ఛి=తోఁక మిక్కిలి సన్నముగా నున్నది.

ఈరెండును(౪-౫) అధిపతిని సంతానశూన్యుని జేయును.

౬ లోమశోష్ఠి=ఓష్ఠమందు కఠినమైనలోమపుంజము కలది. అధిపతిని నశింపఁజేయును.

వర్ణదోషములు.

౧ కృష్ణశీర్షి = నల్లని శిరస్సు కలది.

౨ కృష్ణ ప్రోథ = నల్లని ప్రోథము కలది.

౩ కృష్ణ పృష్ఠి = నల్లని వెలపులు గలది.

౪ కృష్ణధరి = నల్లని అధరోష్ఠము గలది.

౫ కృష్ణోదరి = నల్లని కడుపు గలది.

౬ కృష్ణ మేహాని = నల్లని మేహనము గలది.

౭ కృష్ణ తాలువు = నల్లని దవుడలు గలది.

౮ కృష్ణ జిహ్వ = నల్లని నాలుక కలది.

ఈ యెనిమిది యోగ అధిపతికిని తనకును యుద్ధమరణమును జేయును.

౯ భిన్న శిరోవాలవర్ణి = శరీర మందంతట నొక్క వర్ణమును శిరోవాలములందు మఱియొక వర్ణమును గలది. అధిపతికి మరణమును జేయును.

౧౦ దీప్తపుచ్ఛ = శరీరమందంతట తెల్లని వర్ణమును తోకకొనను మఱియొక వర్ణమును కలది. అధిపతికి కౌతుక నాశమును జేయును.

౧౧ త్రిసవి = తెల్లని శరీరమును నల్లనై వెలయుచున్న శిరస్సును గలది. అధిపతి ధనము సంతతిని నశింపఁ జేయును.

౧౨ నీలగ్రీవి = శరీరమందంతట తెల్లని వర్ణమును కంఠమందు నల్లని వర్ణమును గలది. అధిపతియొక్క ధనమును కీర్తిని నశింపఁ జేయును.

౧౩ ముసలి = మూడు కాళ్లయందు తెల్లని వర్ణమును ఒక్క పాదమందు అన్యవర్ణమును గలది.

౧౪ విషమపాది = ఒక్క పాదమందు తెల్లని వర్ణము

ను అన్యపాదములయందు, అన్యవర్ణమును గలది- ఈరెండును (౧౩-౧౪) అధిపతికి అశుభమును జేయును-సుదుటచుక్క యుండెనా ఈదోషము కలుగదు-

౧౫ అవఘటము= పులివలె నానావర్ణములు గలది- అది మిక్కిలి కీడును జేయును గాన అధిపతి తనదేశమున దానిని ఉంచక పరిహరింపవలయును-

ప్రసవదోషములు.

౧ యమళప్రసూతము=కవగా పుట్టినది-
౨ దివాజాతము=పగలుపుట్టినది-
ఈరెండును అధిపతియింటిని దహింపజేయునుగనుక దీనిని దానము చేయువలయును-

ఆవర్తదోషములు-

౧ కకుదావర్తి=మూపురమందు సుడిగలది- అధిపతికి సౌఖ్యనాశమును జేయును-
౨ శాకసావర్తి= జత్రుదేశములయందుసుడులుగలది. అధిపతికి యుద్ధమరణమును జేయును.
౩ జాన్వావర్తి=మోకాళ్ల మీద సుడులుగలది. ఈగుణములు కాలలోనున్న యెడను అధిపతికిరోగవేదనను జేయును-
౪ కక్షావర్తి= కక్షములయందు సుడులుగలది- శత్రువులవలన వేదన, చోరవేదన, రాజ్యభ్రష్టత్వము, వీనిని జేయును- దీనిమీద నైక్కినచో శోకానలదగ్ధుడగును.
౫ హృదయావర్తి= హృదయమందు సుడిగలది. అది

పతికి అశుభమును జేయును.

౯ ధ్రువహీనము= దశధ్రువములలోనేదైనను ఒక్క ధ్రువము తక్కువగాఁగలది. ఈగుఱ్ఱము అధిపతికి అశుభమును జేయును. తానుఅల్పమైన ఆయుర్దాయము కలదౌను.

జిహ్వాదోషములు.

౧ గోజిహ్వ= ఆవునాలుకవంటి నాలుకకలది. అధిపతికి రోగములను జేయును.

౨ అహిజిహ్వ = పామునాలుకవంటినాలుకకలది. అధిపతికి అశుభమును జేయును.

సామాన్యదోషములు.

౧ ఖరసారము= గర్దభము ఆకృతివంటి ఆకృతియయినను దానివర్ణమువంటి వర్ణమయినను దానిస్వరమువంటి స్వరమయిననుకలది. అధిపతికి పుత్రమిత్రహానిని జేయును.

౨ నపుంసకము= మృదువై ఉత్థానములేని మేఢ్రముగలది. అధిపతికులక్షయమును చేయును.

౩ స్తని= మూత్రకోశ పార్శ్వమందు స్తనాకారదీర్ఘ చర్మవిశేషముగలది. అధిపతిని నశింపఁజేయును గనుక దీనిని స్వదేశమున నుండనీయఁ గూడదు.

౪ మస్తకహీనము= చిన్నతలకలది. అయిదుసంవత్సరములలో తానుమృతిబొందును. బ్రతికినా అధిపతినిని అతనికులమునును నశింపఁజేయును.

౫ మార్జాలకర్ణి = పిల్లిచెవులవంటి చెవులుగలది. అశుభమునుజేయును.

౬. దీనముఖి = చిన్నఁబోయియుండెడి ముఖము కల ది. ఇదిఅల్పాయువగును.

ఇది శ్రీపరవస్తు శ్రీనివాసాచార్యులయ్యవారలుఁ గారిచే
రచింపఁబడిన

హయలక్షణసారము.

విశాఖపట్టణము
చెంగల్వరాయని పేటలోనున్న
ఆర్షముద్రాశాలలో
పూర్వము
ముద్రింపఁబడిన గ్రంథములు
సంస్కృతము.

---

రూ.అ.పై.

౭-౦-౦. లఘుశబ్దార్థసర్వస్వమునందు మొదటిభాగము. దీనిలో అకారము ఆదిగాఁగలశబ్దములన్నియు నుండును Demy 4 to 412 pages bound

౬-౮-౦. డిటో ... ... ... ... unbound.

ఈగ్రంథము (Sanskrit Encyclopedic Lexicon) సంస్కృతభాషలోనియన్నిశబ్దంబులు వానియర్థములు, విగ్రహములు, పర్యాయములు, భాషాంతరనామములు, శిక్షావ్యాకరణచ్ఛన్దో నిరుక్తజ్యోతిష కల్పపూర్వోత్తరమీమాంసా న్యాయవైశేషిక పాతఞ్జల వైద్యసంగీత ధనుర్విద్యార్థ శాస్త్రపురాణేతిహాసాది విషయంబులు, దీనినన్నిటినిఁ దెలియఁజేయును. గ్రంథము నుచూచిన నైనమతివిశేషములు తెలియును. ఇది మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకట రంగాచార్యులయ్యవారలుఁగారిచే రచియిం

రు-అ-పై

పఁబడినది-

౧- ౨- శ్రీభాష్యములో ప్రథమ ప్రకరణము-శ్రీభగవద్రామానుజాచార్యవిరచితబ్రహ్మసూత్రభాష్యము- శ్రీశ్రుతప్రకాశికాచార్యవిరచిత శ్రుతప్రదీపికాఖ్యవ్యాఖ్యతోఁగూడ 8 vo. 144 pages.

౦-౧-౨-౦ ఆర్యాసప్తశతి- ఇది శృంగార రసప్రధానంబగు కావ్యము. శ్రీగోవర్ధనపండిత విరచితము- అవతరణికలతో నున్నది ... ... 8vo. 79pages.

౦-౯.౦ ప్రియదర్శిక శ్రీధావకమహాకవిచే రచియింపఁబడిన నాటిక- శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుఁగారిచేఁ రచియింపఁబడిన ఆదర్శ ఋనువ్యాఖ్యతోఁగూర్పఁబడినది-...12 mo 102

౦.౧౧.౦ విక్రమోర్వశీయము-ఛాయాసమేతము-12mo118

౦.౧౨ ౦ మాళవికాగ్నిమిత్రము-వేమభూపాలవిరచితవ్యాఖ్యానసహితము- ... ... 12mo 173.

౩-౪ .౦ కావ్యదర్పణము.సంపూర్ణము12 mo628pages ఇదిప్రబలమయిన యలంకారశాస్త్రగ్రంథము- మూలశ్లోకములును వ్యాఖ్యయు శ్రీరాజచూడామణిదీక్షితుని చేరచియింపఁబడెను- కావ్యప్రకాశకువిస్తరవ్యాఖ్యానాఁదగియుండును-

౦-౯-౦ సిద్ధాంతకౌముదీ సంధిపంచకము- తత్త్వబోధిని యనువ్యాఖ్యతోఁగూర్పంబడినది 12mo 106.

౧-౦-౦ పరిభాషేందుశేఖరము- రాఘవేంద్రాచార్యవిరచిత త్రిపథగాఖ్యవ్యాఖ్యతో 12 mo 173.

౦- ౨-౦ మథురానాథీయపంచలక్షణి- మూలముతో 12mo18.

# తెనుగు.

## హిందూజనుల మతములను తెనుఁగుభాషలో తెలియఁజేయు సంగ్రహములు

| అణాలు | | పేజీలు | అణాలు | | పేజీలు |
|---|---|---|---|---|---|
| ౨ | ఈశ్వర స్తోత్రసం॥ | 18 | ౧ | ఈశ్వరసంగ్రహము | 12 |
| ౧ | బాలపాఠ్యసంవాదము | 8 | ౧ | గుణసంగ్రహము- | 12 |
| ౧ | అన్యమతసంవాదము | 14 | ౨ | ముక్తిసంగ్రహము- | 20 |
| ౧ | అన్యమతసంగ్రహము | 6 | ౨ | అలంకారసం॥ | 20 |
| ౧ | అవతారసంగ్రహము | 9 | ౧ | స్మృతిసం॥ | 15 |
| ౧ | సృష్టిసంగ్రహము | 1 | ౧ | కర్మసంగ్ర॥ | 16 |
| ౧ | ధర్మసంగ్రహము | 10 | ౧ | విద్యాసంగ్ర॥ | 8 |
| ౧ | జన్మసంగ్రహము | 5 | ౧ | దేవతాసంగ్ర॥ | 16 |
| ౧ | వర్ణసంగ్రహము | 16 | ౨ | వివాహసంగ్రహము | 19 |
| ౧ | ప్రమాణసంగ్రహము | 16 | ౧ | కాలసంగ్రహము- | 16 |
| ౧ | వేదసంగ్రహము | 16 | ౧ | ముక్తిమార్గసంగ॥ | 8 |
| ౧ | శాఖాసంగ్రహము | 6 | ౨ | ప్రాయశ్చిత్తసంగ్ర | 32 |
| ౧ | ఆత్మసంగ్రహము | 16 | ౨ | రహస్యసంగ॥ | 35 |

౪-౦ శ్రీనివాసలక్షణము- మూలము సీసపద్యములుదాహరణములతోఁ గూడియుండు- ఇది పూర్ణముగా గణములను యతిప్రాసములను పద్యలక్షణములను దెలుపును.

౦-౯ మహాపాతకపురకథ- ఇది భట్టివిక్రమార్కులకథ-ఒక వచన కావ్యముగాఁ జేయఁబడినది-16 mo. 12

౧-౦ పరమానంద శిష్యకథ- ఇది అవివేక వ్యాపారములను

శకోశమట్టిదో తెనుగునకిదియట్టిది. అమరకోశమున
దువలెనే కాండములు వర్గములు అన్నియునుకలవు.
నిలో క్రియావర్గ మొకటి అధికము

భట్టభాస్కరీయము. भट्टभास्करीयम्. తైత్తిరీయోపని-
షద్భాష్యము. ఇది విద్యారణ్య భాష్యముకన్నను చా
ప్రాచీనము.

యోగసారము. యోగపాతంజలమునకు తెనుగుటీక. దీ
లో, భోజదేవవృత్తి, యోగసూత్రమణిప్రభ, యోగ-
భాష్యము, యోగవార్తికము, యోగరాజవల్ల-
భము, యోగవాసిష్ఠము, వీనిలోని విశేషము లన్నియు
వ్రాయఁబడియుండును.

☞ వీనిలో నాగరలిపితోఁగూడ నామనిర్దేశము చేయఁ
బడిన గ్రంథములు, సంస్కృతము సంతయును నాగరలిపిని
ముద్రింపఁబడియున్న గ్రంథములని తెలియఁగవలయును.

ఈయార్షముద్రాశాలలో ముద్రింపఁబడిన గ్రంథ-
ము కావలయువారలు ఆర్షముద్రాశాల ప్రొప్రైటరు
లైన శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవార-
లగారి పేర వ్రాసి తెప్పించి కొనవలయును.

వ్యాల్యూపేయబిల్ గాఁగూడ గ్రంథములు పంపఁబడును.
రు ౧-౦-౦ లకు అధికమైన క్రయముగల పుస్త-
కములు రిజిస్టర్డ్ వ్యాల్యూపేయబిల్ పోస్టున పంప-
బడును.

ARSHA PRESS, VIZAGAPATAM, 1892.